# హిమగళము

మోటూరి వేంకటరావు



133
―
2

నవ్య సాహిత్య పరిషత్తు
గుంటూరు

ఈ కవి కృతులు

తులసి కోట : పద్య కావ్యము

పన్నా : పద్య కావ్యము

పూజారి : కావ్యము

కుసుమ హారనాథ : నాటకము

మృగతృష్ణ : ముద్రిత కావ్యము

# హిమ గళము

(ఖండ కృతులు)

మోటూరి వేంకటరావు

నవ్య సాహిత్య పరిషత్తు
~ గుంటూరు ~

గౌరీలోకవాసిని

నా సోదరి

ఆలవిల్లి పుల్లమ్మ

1918 - 37

## అంకితము

చల్లని చెల్లీ! వెన్నెల
వెల్లీ! తెలిమల్లెతావి వెల్లువఁగా జా
బిల్లి పిసాళి పుపుంగుడి
పుల్లతఁ జేరితివి - నూలుపోఁ గిది నీకై!

లే యలరు తేనె కడుపునఁ
దీయని కప్పురము తీయు తెమ్మెరల వలెఁ
నీ యూరుపు సవ్వడులే
నా యంతఃకరణ వాసనల వెలిఁ జిమ్మెన్.

# ఆభాషణము

తెలుఁగు కవితా ప్రపంచమున మూఁడు దశాబ్దులుగా నెప్పటి కప్పటి కేవో క్రొత్తమార్పులు పుట్టుచునే యున్నవి. మొదటి మార్పునకు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు ఆచార్యులు. రెండవమార్పునకు శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఆచార్యులు. మూడవమార్పునకు శ్రీ శ్రీ ఆచార్యుడు. ముక్కుమొగము లేని మార్పులు చాల మఱియు నున్నవి. వాని శైష్యోపాధ్యాయికా క్రమము భగవంతునకుఁ దెలియవలయును. ఇందలి యాచార్య శబ్దముచేత ప్రత్యక్షరమునకుఁ బ్రత్యక్షతా ప్రసక్తి లేదు. ఒక్కొక్కప్పుడు ఆ మార్గ మని కూడ వ్రాయసగానికిఁ దెలియదు.

కాలముగూడ నొక గాలివంటిది. ఆగాలి ప్రసరించి నంత మేర భూతప్రపంచమం దాయా వికారము లన్యోన్యాపేక్ష లేక స్వయంసంభవములుగా నున్నట్లు ఒక కాలమందొక మార్పు కలిగినప్పుడు ఆ మార్పు తోఁచిన సర్వస్థలములయం దన్యోన్యాపేక్ష యుండ నక్కరలేదు.

ఈ హిమగళము రెండవమార్పునకుఁ జెందిన గ్రంథము. కాని దాని యాచార్యుని గ్రంథములు చదివి పొంగి పొరలినది కాదు.

ఈయన కవితా ప్రవాహము దాని యంతట నదియే వెల్లివిరిసి నది. రెండవ మార్పున కీ కవితామార్గ మేల చెంచెననగా సర్వ శయ్యయు, కూర్పుపద్ధతియు నా మార్గమునే చెప్పుచున్నవి. "తరంగాలు" మొదలైన క్వచిదంగీకృత బహువచనరూప ములు, "ప్రేమతృష్ణ నినదించుట", "కలలలో తేలిపోవుట" "స్వప్నమధుజ్యోతి", "బాష్పగీతి" "అమృతశాల" "ఏ కిన్నరులో పలుకరించి" "వేయి వీణ లెటనుండియొ వినబడి" "మ్రోగిన నాదు విపంచి", యిట్టి నూత్న ప్రయోగము లనంత ములు. ఆ రెండవమార్పు కవితాపద్ధతికి సహజమైన శబ్దజాలము ఈ గ్రంథమంతయు నిండియున్నది. కాని వట్టి శబ్దజాలమును బట్టియే యీ వర్గీకరణము. భావనాపద్ధతిలో నర్థవ్యక్తివైఖరిలో నితని కవిత్వమందొక విశిష్టమైన వ్యక్తిత్వము కలదు.

పండితులు పూర్వకవిగ్రంథవాసనాబహుళమతులు. ఈ మార్పుల నంగీకరించి వానియం దాస్వాద్యతను పొందలేని కారణము ఈ క్రొత్తశబ్దజాలమే. ఈ శబ్దజాలముతో పరిచయ మును, సానుభూతియు లేనిచో ఆ కవులకున్న దివ్యమైనకవితా శక్తి లేదనియే యనిపించును. అచ్చము వేదములు చదివి కావ్య ప్రపంచమునం దాదరమే లేక వానిని గుఱించి వినని వాఁడు తొలుత కావ్యమును తిలకించినచో వానికంతయు విప రీతముగాఁ గనిపించును. కాళిదాసాదుల కీర్తి వినినతరువాత కావ్యములయందు సానుభూతి కలుగును. అపేక్షతోఁ జదివిన

తరువాత ఆస్వాద్యత కలుగును. అబ్బేకృష్ణశాస్త్రి ప్రభృతుల గ్రంథములు చదివి వానియందున్న శబ్దములు, కూర్పు, భావము పోవు తోఁవ, వానితోఁ బరిచయ మేర్పడినచో ఈ రెండవ మార్పునకు సంబంధించిన గ్రంథసముదాయ మాస్వాద్య మగును.

ఈ హిమగళము ఈ మార్పులోని కావ్యములలో నుత్తమ జాతికిఁ జెందియున్నది. ఈ గ్రంథము యొక్క రచనకూడ నొక దశాబ్దికి జరిగియున్నది. ఈ రెండవ మార్పు కెరట మునకు కాలము గూడ నదే.

ఈ క్రొత్తగా వచ్చిన కవనములో యువకవు లందఱు "ప్రకృతి", "మరణము", "చైతన్యము", మొదలైన మర్మ విషయములు ఎక్కువగా కవితావస్తువులుగా స్వీకరించుచు వచ్చిరి. "రెండు లోకాలు" "ఘరాకోటి" "చైతన్యము", ఈ శీర్షికలు వానికి సంబంధించినవి.

ఈ కవిత్వములో సంగీతము, శిల్పము, ఆకాశము, సెల యేళ్లు, కొండలు, వీని వీనికి సంబంధించిన భావములు, వానితో సంబంధించిన కొన్ని పలుకుబళ్లు, పరిభాషగా నైపోయినవి. "అపస్వర"మని యొక కావ్యశీర్షిక. ఇది గానశాస్త్ర పరి భాషలోనిది. "సెలయేరు", "తాజమహల్", "మధు క్షణము", మొదలైనవి వానినే సూచించుచున్నవి.

ఈ కవులు – తక్కినలోక మశుభ మనుకొనుదానిని–యా దార్థ్యజిజ్ఞాసువులు – కవిత్వమునుండి బహిష్కరించరు.

మోడుసెదుట నిలుచుండి యీకవి,

"సీ వలెనె మోడునైయున్న నేను బాష్ప
నదములనుగట్టి నీదు కట్టెదుట నిల్వ
ఈ శరీరమునుండి బహిర్గతమయి
శల్యపంజర మిట్టె సాక్షాత్కరించు."

మోడైన యా చెట్టుసెదుట నిలుచుండి తన్నుఁదా శల్య పంజరముగాఁ జూచుకొనుచున్నాడు. మొదటిసారి యీ భావము వెగ టనిపించవచ్చును. కాని కవితాత్మలోఁ జొఱఁ బడినతరువాత నెంత యుత్కృష్టముగా నుండునో!

ఈ మార్గమున జాలువారు కవనములు, కొన్ని సమాస ములలోని భిన్నశబ్దములు, వ్యతిరేకార్థద్యోతకములుగా నుండును. "మంచు మంట" ఇదియొక శీర్షిక. ఇట్లు సమాసము కూర్చుట పూర్వకవులు చేయలేదు. కాని చంద్రుడు నిప్పులు చెఱగుట, కోకిలకూత బాధపెట్టుట మొదలైనవి యుండనే యున్నవి.

"తవ శ్రీఖండచర్చా విషం, శీతాంశు స్తపనో
హిమం హుతవహః క్రీడాముదో యాతనా"

ఇటువంటివి లక్షలు. "మంచుమంట" వైపరీత్య మేమున్నది? తదవస్థానుసంధానము పాఠకుఁడు చేసికొనవలయును.

ఈ కవికి చక్కని కవితాశక్తి కలదు. తెలుఁగుకవికి అను ప్రాసాత్మకమైన యొక రచనావేగ ముండవలయును. అది యీయనకు సమృద్ధిగా నున్నది.

'తళుకు,
లీనుచు సురభీకరించి
చెడిపోవదు వాసనయు
విడిపోవదు నైజ ముడిగి.'

ఈ కవి రెండవమార్పులోని వాఁడైనను మూడవ మార్పులోని శబ్దజాల మొకచోట కవితా భవిష్యత్పరిణామసూచి వలె సంతరించినాడు.

" ఇది ఉషాదేవి యగు
నినుపగ జైల జీవి
యీ గ్రుడ్డికటంపు
టిరుసు కంచెన సొంపు
తురుముకొని తనకురుల
ఇరుల పులిమిన వేళ "

ఈ కూర్పు రెండవ మార్పునకు చెందినది కాదు. మూడవ మార్పునకు జెందినది.

ఈ కవి భిన్నఛందస్సులలో పలుపోకిళ్లు పోఁగలడు. "విక్రమ" "మధువాసన" "కలీ" "రెండులో కాలు" "గుమ్మెటపాట" "సెలయేరు" ఇవి యన్నియు గేయములే. దేనికదే క్రొత్తపోకడ. మఱీ గుమ్మెటపాట పాడుటకు రమ్యమైన గేయము. ఇటువంటిది దువ్వూరి రామిరెడ్డిగారి "అభి

సారిక.'' కాని యీ కవి యా యభిసారిక నెరుగడు. ఆ వరుస యీయనకుగూడ నోటివెంట వచ్చినది.

ఈ కవి కింత సుకవిత యెట్లలవడినది? దీనికి హేతు వేది యని విచారించగా ఈకవియే యిట్లు చెప్పుచున్నాడు.

"ఈవలిరేయి నాత్మబలి నింతసమర్పణ చేసికొన్న నా
జీవిత మార్గమందు వికసింపఁగఁ జేతువొ! నీ యనంత కాం
త్యానిలమైన ప్రేమ! మును నర్జునునిన్ జరితార్థుఁ జేయు గీ
తా విదితార్థపూతమగు తత్త్వముఁ బోలి సుధామరీచివై!''

అర్జునునకు కృష్ణుని గీత తత్త్వోపదేష్ట యైనయట్లు తనకు తన చెల్లెలి ప్రేమ కవితోపదేష్ట యయినది. ఆ చెల్లెలు కవయిత్రి. ఈ గ్రంథమంతయు వారి యిద్దఱి సగర్భప్రేమగాథయే. ఈ గ్రంథమే యామె కంకితము. "ఓచెల్లి'' అనిన విషాద కావ్యమునం దితని కవిత్వము పరాకాష్ఠ పొందినది. దివంగతుఁడు మా కొడాలిసుబ్బారావు తనతల్లిని గూర్చి వ్రాసిన గేయ మెంత శోకరసావధిగా నున్నదో; మా నాయని సుబ్బారావు మాతృగీతము లెంత రసావధులుగా నున్నవో యీతని సోదరీనిర్వేదము గూడ నంత రసావధిగా నున్నది.

ఈ కవి కడు మెత్తనిమనస్సు గలవాడు. మనిసిని చూచినచో ఆయనతో మాట్లాడినచో ఈయన యెంత మంచివాడో తెలియును. అట్టివాడు గూఢ తన యనూయక హృదయము

మార్చుకొని లోకములోనికు కొంత వైపరీత్య మవలంబించ వచ్చెనట. "కని"యన్న కావ్యములో "ఓసి హింసాప్రపం చమా"యని పిలచి యిట్లనుచున్నాడు.

"ఇట్టె కలగుండు వడిన నా యెండు టెడద
నుద్భవించుచు నున్న వత్యుగ్రదహన
కీలికామాల లేవొ! పాతాళఖనుల
రోహిత జ్వాలలేవొ."

"గ్రామోడు", "అంధుడు" "రేణువు", "కాటిదేవత"అన్న కావ్యములలోని యీయన యూహాశాలిత్వమున కవియే సాటి.

అన్నిటికన్న యీయన కావ్యరసాస్వాదననిష్ఠ నికషాయ మాణముగ నున్నది "సెలయేరు" అన్న కావ్యములో. వేద కాలమునుండి, కాళిదాసునుండి నేటివఱకువచ్చిన కవితామధు స్రవంతిలో ఈయన మునుకలాడును. వాని శీకరములలో నితఁడు జీర్ణించును. ఇతనిలో నవి జీర్ణించును. దానియం దద్వైత కైవల్య మందును. దానిచేత నోదార్పఁ బడును. దాని యాధారమున అమరచైత్రరథ మ్మందుకొనును. అందులో నీడగా నొదిగి ప్రత్యణువు సాయుజ్యమందును. ఈ కోర్కు లన్నియు భగవంతుడు ఫలింపించుగాక.

బెజవాడ
25 . 7 . 42

విశ్వనాథ సత్యనారాయణ

# మ ధు క్ష ణ ము

నందనోద్యానవనతలాంతర్విహార
వాయువులు సోఁకెనో యేమొ నాయెడంద
తరుణపారిజాతంపు మెత్తందనాల
సోఁకు నించెను మధుర మౌ రేకు లెత్తి.

మోడు తలఁపులు నాలోన మూఁగవారి
జీర్ణిలుచునున్న నానాఁటి స్మృతిపథమ్ము
లివతలింప సుధాస్యంది హిమకరమ్ము
తట్టి లేపిన దీమధూదయపు వేళ.

కన్నెవలపుల మధురిమ కన్న మధుర
మైన గాటంపు రక్తి న న్నాహరించు
ఈ శుభ ముహూర్తమందు నాయెడఁద నెవరొ
నాటినారు కళోజ్జీవనంపు మొలక.

నా హిమాచలశిఖర సంధ్యాతుషార
చారుతీరంపుఁ జిట్టచిటారుపులక
మధుర నాట్యరసాంచితో న్మత్త యొాచు
జ్వలనమాలిక లల్లె నీక్షణమునందు.

కదలిగర్భమ్ములోఁ దరంగాలువోలె
నాబ్రతుకులోన నెన్ని క్షణమ్ములో జ
నించి నశియించె — నేఁ దేల ఈక్షణమ్ము
రేయి వెన్నెలగా మధురించిపోయె ?

ఇది యపూర్వ మధుక్షణ మేమొ! ఇంత
చలువపురుటింటి మొగిలి పొట్టల వెలార్చు
కమ్మ నెత్తావిలో జలకమ్ము లేమి ?
ఈ శరచ్చంద్రికోత్సవ నృత్యమేమి ?

ఇట్టె లాలించి, సోలించి, ఇట్టె నన్నుఁ
గదిపి యూపిన ఈ మధుక్షణమునందు
నూరుకోలేను సన్నని యూర్పురేక
గా నెగసిపోవుదునొ తారకాప్రశాంత
వాటికల దాటి మిన్నేటి పాట దరికి!

# సుధా పరీక్ష

తీరని ప్రేమతృష్ణ నిన
దించిన స్రోతల నాప లేక, నే
నీ రజనీ హృదిన్ దెలచి
యించుక చూచితి - పర్వతమ్ములన్
జారు సరిత్తులట్లు ముడి
చంద్రికలే విడిపడ్డ సోనలై
యూరక పొర్లిపాఱె, నొక
జ్యోతిరణుప్రభగా సుమించితేన్.

ఓ యమృతస్వరూపిణి ! న
వోదయ తేజము జాలువారు నీ
లేయెద పాలబాటల వి
లీనత నొందితినేని, ఊహలే
నాయనుభూతులై విరిసి
నాట్యము సేయఁగఁ జెప్పరాని యె
న్నో యుగముల్ రహస్సుధల
నూరెద మాఁగిన తేనెతుట్టెగా.

నీ సుషమాననమ్ము కమ
నీయముగాఁ జిలికించు కౌముదీ
హాసము లొక్కటొక్కటి అ
నంతవిలాస కళా కలాప వి
న్యాస సుధాప్రపంచ భర
మై పురి విచ్చిన ప్రేమవాసనల్
మోసిన, నాదుజీవితపు
మోసుల దిద్దితిఁ బాలమ్రుగ్గులన్.

నీ దరహాస రోచులకు
నీకడ నిల్వక నీలిముద్దయై
యేదరిజాడకో పరువు
లెత్తు తమిస్రపుధూళియందు నా
వేదన లన్నిటిన్ విసరి
వేసితిఁ, గారుమొయిళ్ల గుండెలోఁ
జేదిన మించుమంటవలెఁ
జీఁకటిమూఁతల నిండి తొట్రిలన్.

ఒక నిముసమ్ము నీయొడిని
నూరట నొందు తపఃఫలాన, ఖా
తికపు విషార్చు లీను జగ
తిన్ బరమాణువుగా నొనర్చు ఏ
వికసితపుణ్యలోకమునొ
వెన్నెలదారి వినిర్గమించు దై
వికపు జగామెఱుంగు లర
విచ్చెను నాబ్రతుకున్ స్పృశించుచున్.

భవదమృతోపగూహన శు
భ క్షణ మూఁదిన యూర్పుగాడ్పులన్
దవిలి, పవిత్రమై, గగన
నైల్యకవాటపు మెట్ల దాక క్రొం
బువునవకంపు టామనుల
పూఁతలుదిద్దిన తోరణాలు నీ
రవ హిమతారకాంచలము
లణా గదలించెను పైఁడిగంటలన్.

# రాధ

ఆమె యేనాఁడో పుడమిచూలాలు గన్న
వలపుపంటల తొలిమొగ్గ - పలుచతావి
వోలెఁ దీయని కలలలోఁ దేలిపోయె
నామె బ్రతుకు శారదనిత్యకౌముదులను.

ప్రీతిఁ గొల్పు భరద్వాజగీతికలను
బల్లవించు ప్రాతర్మందపవనమట్లు
నవ్యమోహన మురళీ నినాదమునకు
నామె వెన్నెలరేకయై యదరిపడెను.

ఆమె తాండవకృష్ణుని యమృతహాస
పరిమళాస్వాదనమున మై మఱచి వలపు
ముంజెయై కన్ను లరమోడ్పఁ బొరలిపొరలి
నవ్వుఁగెంపులఁ గురిసె బృందావనమ్మె.

వేణుగీతికాన్వేషణ విరహనిశల
నామె మంజీరమంజు విన్యాసశబ్ద
ముద్రితవసంతశాలల మోసిమోసి,
పులకరించెఁ గళిందజాపులినసీమ.

ప్రేమపూజారిరంసతో నామె కోమ
లాత్త వనమాలికంఠమధ్యమ్ము నందు
లేఁత పూదండయై మధులేశములను
బంచిపెట్టెను ప్రాణేషట్పదములకును.

# తా జ మ హ ల్

సాంధ్యజీవకాంతిగ నొక
సారి మెఱసిపోయిన యే
స్వప్నమధుజ్యోతి కాఱకొ
షాజహాను హృదయ మిచట
వేల్చు బాష్పగీతిఁ జిర
ప్రేమసమాధిని రచించి.

అఖిలరాజ్యరత్నకిరీ
టాధిపతి లలాట లక్ష్మి
పేద యౌచుఁ బ్రణమిల్లెను
ప్రేమదేవతాంఘ్రి సోక.

3

రాజ్యవిభవ మారిపోయె,
రత్నమకుట మవనిఁ గలిసె,
ప్రేమతేజమే అనంత
విజయ పతాకను వహించె.

ఏనిశ్చల మగు తపస్సు
నూనిన హృదయముల జంట
ఈ నెలరాల బవంతిని
నేకత్వము నొంది దివ్య
తేజమునే కురిసినదో!
దేవతలే జలదరించి
మినుకు మనెడు మిణుగురులై
మింట వెలుఁగు చుక్కలైరి-

ఆ పవిత్రహృదయుల ప్రణ
యమ్ము సమర్పించిన యా
తిథ్యసుధాభిక్షయె జ్యో
తిః ప్రకాశమాల లల్లి,
వెలిఁగిపోదె శాశ్వత మీ
విశ్వ మంత వెన్నెలగా!

ఏనాఁ డిచ్చోట ప్రణయ
సూనము రే కెత్తినదో!
ఈనాఁటికిఁ గూడఁ దళుకు
లీనుచు సురభీకరించి
చెడిపోవదు, వాసనయును
విడిపోవదు నైజ ముడిగి.

అసురకాంత పెదవులపై
నమృతబిందు వొకటి తొణికి
స్వర్గలోకపథము పీడి
జారిపడియె నేమొ! ఇచట
మర్త్యలోక మొల్కిన ప్రే
మమునకు దివ్యత్వ మొసఁగ—

పదునాలుగు జగము లేలు
ప్రణయదేవతకు నిశాంత
మంగళ మధుమాస నాట్య
రంగమె - ఈ యమృతశాల.

దుగ్ధపథపుఁ బూఁదీఁగెల
తూఁగుటూయెలలను గెరలు
రిక్క పసిఁడి పసి నిసుగుల
లక్కబొమ్మ యీ భవనము.

శైశవసౌందర్య మొలుకు
శాంత చిదానందము వలె
నే యమాయకపుఁ బ్రేమయొ
యీ యెడ సెలమై స్రవించు.

కీలు సడలు తరఁగల గిలి
గింతల సడిసన్న మ్రోఁగు
ఏఁటినీటి పసల గగు
ర్పాటుగ, జాబిలికౌఁగిట
రేయి నూలుకొన్న చలువ
రేకుల నీ సొగసుకొణిగ
మెఱపుతీవతో కార్త
స్వరసరికను గ్రుచ్చినట్లు,
మురువు సూపదే వలపే
మురువును సవరించి దిద్ద—

ఈ ప్రేమ సమాధి గోపు
రప్రభలకు 'ఫగిడి' వోలె
నుదధిపైని దేలి వచ్చు
నుషఃకాంతి పొడిచి, నవ్వు
పువ్వుల జిగి నెగజిమ్మునొ!
మువ్వల సడి గుప్పించునొ!
యుగయుగాలు దొర్లిపోవ—
జగతి నాడులే బిగియగ—

ఈ యమృతపు హర్మ్యములో
నాయెద త్రుళ్ళింత లిడుచు
గలవరపడు గళమున దొ
ట్రిలినంత రవంత - లలిత
కవితగ, నవ్యక్తమధుర
రవముల నే కిన్నరులో
పలుకరించి, యేనాటిదొ
ప్రణయగాథ వినిపింతురు
వేయి వీణ లెట నుండియొ
వినబడి వినబడని యట్లు,

అతిలోకపరిణయమయపు
టమృతకళాసృష్టికి నా
కందోయి చెమర్చు మలిన
బిందువు లేరెండో రాలి,
యీముత్తెపు నేల సోఁకి,
కౌముదిలోఁ దుహినకణము
లణఁగి మధుర మైన యట్లు
పరిణయబింబితము లైనవి.

## పాలబాట

అది నభోమధురాంగి హృదంతరాళ
కోణములు పూసికొన్న జ్యోత్స్నానవామృ
తంపుఁ బ్రేమాణువుల బారు - తతసుధాక
ణాల జ్వలితోరువికచ సౌందర్యమునకుఁ
బులకితోన్మేష రేఖా విముగ్ధమధుర
మూర్తులై, జాబువారిక్క పూవుఁబోండ్లు
శిశిరనీహార బంధురస్మితమనోజ్ఞ
గీతికాధ్యాపనములతో జ్యోతులన్ ర
చించి, సృష్ట్యాదినుండి రోచిస్స్వరూప
శిల్పచలనాల నగిషీలు చెక్కినట్లు
నిలిచిపోయిరి జగతుల నిద్రఁ బుచ్చి.

అ సుధారాధ్యపూజాలయమ్ము నుండి
శాంతనిశ్శబ్ద మంగళాచరణము లగు
పూలగుత్తి మతాబుల చాలు విలిచి
చిమ్ముచున్నార లా తపస్వినులె, యీధ
రిత్రిలోఁ బరివ్యాప్తమై, మైత్రి పాదు
కొనుట, కా విశ్వసందేశకుసుమవితతి
పతనముల నుల్క లని త్రోసివైచుఁ గాని,
పావనజ్యోత్స్న లగు తలంబ్రాలె యంచు
నింత తలయెత్తి, యింత సహించఁ బోదు
కంటకమ్మగు పాడులోకము - తదీయ
కలుషవీధుల దోసిల్లకొలఁది మాధు
కరములుగ, నేలొకో! దూది పొరలు వోని
ప్రేమ పూజాప్రసూనముల్ విసరివైతు
రలసతయె లేక చుక్కకన్నెలు నిరంత
రప్రవర్ధిత సౌహార్దలతికఁ బెంచి.

ఏలొకో కద! తారక లీప్రయాస
నిత్యకృత్యములందు నిర్నిద్ర లగుచు

గృత్రిమజగమ్మునకు సేవగింపు లైన
పసుపు పారాణులను బూసి పలుకరింత్రు ! -

ఆ యమృతపథ సాంద్రకళ్యాణవీచి
నెవ్వ రరికట్టఁగలరు? - ఊహింపరాని
గాఢమాయాంధకార సంఘమ్ములందు
నిఱికికొనుచు దురంతవిస్మృతి మునింగి
నట్టి యీ ప్రపంచమ్ముపై నావరించు
మబ్బుకప్పుల తెఱచాఁప మాటు లడఁచి,
దుగ్ధపథ నైజ మెవ్వరు ద్యోతపఱుపఁ
గలరు? - పాలపుంతకు నీజగమ్మునకును
సన్నిహితసూత్ర మిట్టు లజ్ఞాతముగనె
సాఁగిపోవునొ కాలవిశ్రాంతి దాఁక !

## అంధుఁడు

చూపు లందని దివ్యస్వరూప మేచు
తత్పరంజ్యోతి కబలితాంతర్యశోభ
నెన్ని యుగములకేని దర్శించు కోర్కె
నతని పుట్టుక తోడనే, అతని కనులు
జగతి క్రేళ్ళుబ్బు పేద వసంతమునకు
వికసనము చూపనే లేక పెడమొగమ్ము
పెట్టినవి—
నాఁడు మొదలు జీవితపుఁజెరఁగు
లంటనే లేదు లేవెలుఁ గైన సుంత—

తిమిరకల్లోల నిబిడపంక్తిని ప్రశాంత
జీవమాధుర్యములఁ బ్రోది చేసికొనుచుఁ
జిర తపస్స్వాపముద్ర సృజించి, యోగ
నిద్రలో మునింగె నతని నేత్రయుగళి.



తాళిఁ గట్టిన కల్లియూఁతను గ్రహించి...

ఆ సుషుప్తి సహస్రసంధ్యాసముజ్జ్వ
లమ్మగు వెలుంగు కలదు - జగమ్మె దాని
యధికరుచికి నిస్తేజమై అంధ మగును.

తాళిఁ గట్టిన కట్టియూఁతను గ్రహించి,
తనదు పెన్నిధి ముష్టిపాత్రను వహించి,
ఆ మహాత్యాగయోగి పారాడు నపుడు—
అతని జీర్ణాంఘ్రితలముల నడ్డు తగులు
కంటకలతాళి గూడ మొగ్గలను దొడుఁగు,
అతని గాలి సోఁకిన మాత్ర నంజలించి
బుద్ధమూర్తులు శిలలలోఁ బొడముచుండు.

# చ ర మ శో భ

ఇవి - నెఱసంజయంచుల న
టేశుఁడు చిన్మయమూర్తి యొాచుఁ దాం
డవ మొనరింపఁ దద్రుచి వి
డంబన దివ్యశిఖాపరంపరల్
స్తవ మొనరించి, యేమధుర
లాస్యకళావతు లా నటేశుపై
నవకుసుమాక్షతల్ విసరి
నన్ విరఁజిమ్మిన చిత్రశోభలో !

ఆ యమృతంపుఁదిన్నెలగు
నాగడపల్ జిగిమళ్లగాఁగ, నే
తీయని సాంధ్యగీతి నిన
దించిరొ వేలువుముద్దరాండ్రు - స్వ
ర్గీయనికుంజపాళిఁ గికు
రించిన స్నిగ్ధవయోవికాసముల్
చాయలు దీర్చికొన్నవి కి
సాలయపేశల రత్నశోభలన్!

ఆ రమణీయ నీల గగ
నాంతరపశ్చిమసీమ ముగ్ధ సం
ధ్యారుచిరాంగి నీరద వ
యస్యలతో మృదులాంగహార శృం
గారమధూదయమ్ము లగు
క్రమగతుల్ పచరించి, యాడు కి
మ్మీరపు బంతులాట మిసి
మిన్ నవశోభలు. చిందువారెనో!

ఈ వివృతాంశుపీధి మొన
లెత్తిన కోరికతీవ లెన్నియో
ప్రోవులు ప్రోవులై విరిసి
పోయి, తురాయిహారంగు లీని, నా
క్రేవలలో నెమిళ్ళవలెఁ
గ్రీడలు సల్పిన తావు లాని, బా
ధావిలమైన సోయగపు
టాఁకలితో నుడుకెత్తెఁ బ్రాణముల్.

పాయలు విడ్డ యీ కిరణ
వాహిని వట్టులు వాఱు రాగ మా
ప్యాయముగా, సుధాస్నపిత
హారతు లెత్తెడు రీతి, నా కళా
ప్రేయసి నాటగాఁ బ్రతిఫ
లించిన - నాబ్రతుకంత పాటగా
వేయిముఖాల తోడఁ బల
వింపదె విశ్వవిపంచి నానుచున్.

ఈ చిఱుగీతి నా గళము
నింత బయల్వడి రాకమున్నె, రా
గోచిత నిర్మలాంశువుల
నూపిరి వోసెడు సర్జనమ్ములై
పూఁచిన స్వప్నముల్ చెదరి
పోవునా! మౌనకళాసమాధులై
ఈచరమోత్సవాలు నశి
యించునొ చొక్కపు శిల్పవీధినే!

మాయకు లోఁగి, యీచరమ
మాధురులే యెదొ మంత్రబద్ధమై
పోయిన యట్లు, క్రొమ్మెఱుఁగు
పొంగులు దీరి నిమేషకాల శో
భాయువు లైన నేమి? రుచు
లారని వెన్నెలపిందె కానుపుల్
నాయెద నిండఁ బేరుకొని
నా చిఱుగీతిని దేజరిల్లవే!

# చైతన్యము

## దర్శి ష్ట

మకుటధారివి వై, మునిమాపు పెడఁద
వెలుఁగులును జీఁకటులుఁ బారఁగలిపి నట్లు,
చాయగా, అర్థమే కాక, ఓయనూహ్యా
విశ్వరాహస్యమా! తాండవింతు వేల?

## దృ శ్య ము

కఠినవజ్రింపుఁదునకలోఁ గాంతి నగుచు,
నిరులవిషవస్తిలోన నమృతపు రేక
నగుచు, విలయమ్ములోఁ బ్రశాంతార్ద్రగీతి
నగుచుఁ జైతన్యముగ సృష్టి నావరింతు.

కాంతిలో నిష్ఠురపుటగ్నికణము నగుదు,
నమృతమునఁ గూర్తిరమౌ హాలహాలము నగుదు,
శాంతిగీతిక లోన విషాదతంత్రి
నగుదు, నాలోన నేనె దోహద మొనర్ప.

## దర్శి ష్ట

ఈ యనంత లీలాజ్యోతివై, యి వేటి
వెట్టి కృత్యము లమృతంపు వీచి వౌచు
విసపువీధులఁ దడిపి వెక్కసపు జ్వాల
రవులఁబెట్టెద వా సుధారాశి నడుమ?

## దృ శ్య ము

కర్కశత్వములోఁ బేర్మికణము లొలుకు
కోమలత్వమునే దిద్దికొనుచు, నట్టి
లలితలావణ్యమునకుఁ గూర్తిరత రచించి
నపుడె, ప్రకృతి సౌందర్యమ్ము నద్దుకొనును.

సాగరాకర్షణమ్ముచే సకలనదులు
తరలి, తదగాధగర్భాన నొరగి, ప్రావృ
డంబుదమ్ములుగాఁ జద లంటి, వర్ష
ధారలై, క్రొత్తయేఱులై, పాఱునట్లు
ఈ చరాచర విశ్వశోభాచయమ్ము
నా వయస్సున లీనమై పోవుచుండి
మొదలు తుదిలేని నా చక్రిమునఁ బరిభ్రి
మించును నిదాఘమై, శీతలాంచితముగ.

# సెలయేఱు

ఓ రసాంగోదయ! ఓ ఆర్ద్రహృదయ!
ఓకళాస్వరధార! ఓ సెలయేఱు!

నీ హిమానీమృదు నీరమ్ము లందు
వేదకాలము నాఁటి ఆదిప్రత్యూష
శిశుమూర్తి ఆనందరససుధాస్ఫూర్తిఁ
జిలికించు నురుగువెన్నెల పాలనవ్వు.

రవళించి తూఁగాడు రావిరెమ్మలను
దిగజారు నెలవంక సొగసుచిందులుగ
నీ లేఁత తరఁగల నృత్యాలఁ గదలు
నప్సరోంగనల విన్యాసశిల్పములు

ఓ రసాంగోదయ! ఓ ఆర్ద్రహృదయ!
ఓ కళాస్వరధార! ఓసెలయేఱు!

చూపులో, నూర్పులో, నాపుకోలేక
కలగుందువడు పిచ్చి కవిరాజు వోలె
నీవు నీ పాటలో నిలువెల్ల గరఁగి
విరఁజిమ్మెదవు విశ్వకరుణగీతికలు

కాలమే నీజాలి కడుపులో నిలిచి
మెత్తని గటికపై నొత్తుగా రాలు
పూలశబ్దాలుగాఁ బుకిలించుచుండు
కాళిదాసాది సత్కవుల గానములు.

ఓ రసాంగోదయ ! ఓ ఆర్ద్రహృదయ !
ఓ కళాస్వరధార ! ఓ సెలయేఱ !

నీ పార్శ్వముల శయనించు నామేను
ముద్దిడు నీ చిట్టి ముత్తెపుఁజినుకు
లొక కోటి తారక లుదయించినట్లు
వెలుఁగుఁగ్రొందళుకులై గిలిగింత లిడును.

నీ శీకరముల జీర్ణింతునో నేను !
నాలోన నీ కంకణాలు జీర్ణిలునొ !

అర్థమే కాని యీ యనుభూతి నన్ను
నద్వైతకైవల్య మటు లావరించు.

ఓ రసాంగోదయ! ఓ ఆర్ద్రహృదయ!
ఓ కళాస్వరధార! ఓ సెలయేఱు!

నుదు రదరంగ, నా సొదలు నీ యెదుట
వినిపించి, విడుచు నా వేఁడికన్నీరు
నీరైన నీ గుండెలో రాలినపుడు
కూర్మితల్లిగ నెంత క్షోభించి నావు!

నాకు నేసే వేదనలఁ గాలినపుడు
భుగ్నజీవిత మేర్చు మోడు కొమ్మలను
హేమంత నిశ కౌఁగిలించు చందమున
నా దుఃఖహృదయమ్ము నోదార్చినావు!

ఓ రసాంగోదయ! ఓ ఆర్ద్రహృదయ!
ఓ కళాస్వరధార! ఓ సెలయేఱు!

విలయకాలారంభవేళల యందుఁ
దాండవేశ్వర పాదతాడనమ్ములకు

నిను( బోలు సెలయేటి నిర్మలాంబువులు
పులకించి, యెంతొ యుప్పొంగిపోయె న(ట!

ఆ మహానృత్యవిన్యాసమ్ము లందు
నున్మత్తవై నీవు నుప్పొంగినావ?
శివజటాజూట విస్తీర్ణ భంగముల
గాంగనిర్ఝర నాట్యకళ నేర్చినావ?

ఓ రసాంగోదయ! ఓ ఆర్ద్రహృదయ!
ఓ కళాస్వరధార! ఓ సెలయేఱ!

పసిప్రొద్దు బంగారు మిసిమి పూ(తలను
మెఱసిన విరిరేకు పరువమ్ము వోలె
నీ లాస్యరేఖలో నీ శివత్వమున
నమరచైత్రరథమ్ము నందుకోలేన?

వలపులో, వెతలలో, బ్రతుకులో, నీకె
మధుపూజ లొన(గి తన్మయత నొందెదనొ!
నీ తీ(పిపాటలో నీడగా నొదిగి,
యొదిగి, ప్రత్యణువు సాయుజ్య మొందెదనొ!

# కాఁటి దేవత

ఊరిపొలిమేర నొకశిలాకార మొంది
ముజ్జగమ్ముల శాసించు ముగ్ధనేత్ర
నిశితతేజోనలము విచ్చి నేఁటివఱకు
నిలిచియున్నది దేవతాప్రళయమూర్తి !

ఆ మహాశాంతభీషణశ్యామమూర్తి
నెపుడు శాక్తేయు లట నుద్వహించినారో !
పాడుపడి యున్న యాలయప్రాజ్యశిల్ప
మందు నిదురించె నేనాఁటి యార్యకళయొ !

మఱుఁగు కన్నీటినెత్తురు మబ్బుమఱక
లంటుకొని యున్న దేవీపదాబ్జసీమ
నెన్ని పువుబెడందలు నిశ్వసించినవియొ !
ఎన్ని త్యాగపూజలు మేళవించినవియొ !

ఆ శిలాదేవి - ఈశ్వరి - ఆర్ద్రి యగుచు
నను(గు బిడ్డల నమ్ర మూర్ధాంకములను
దడిపివేసిన యమృతశీతలపు దృష్టి
లరుణనేత్రాల నే(టికి నారలేదు.

స్వాదు జలముల మంగళ స్నాత లైన
లే(త ముత్తైదువుల వయోరేఖ లచట
పసుపునేసలు, కుంకుమభవ్యరుచులు
నిండుకొన్నట్టి వేది స్పందించె నెపుడొ !

ఆ యతిక్రాంతనిత్యకళ్యాణపూజ
లా సుగంధిల కర్పూరహారతులును
గటికి కలవైన వీనా(డు - గబ్బిలములు
గూబలును జేరి తల దాచుకొనియె నచట.

రక్త నైవేద్యములకు( దీరని పిపాస
నుగ్రరూపమ్ముతో నిలుచుండె నాది
శక్తి యని దురావేశాన స్వార్థలోక
మెంత బలిదానములకు సహించె నకట !

పచ్చి రుధిరాభిషేకోత్సవములఁ దేవి
యూపి రాడక, కనుగ్రుడ్ల నుబికిపోవు
నెఱ్ఱజీరలతోఁ దనయెదుట నున్న
ప్రేతభూమి కంపింప నర్తించు నేమొ!

క్షుద్రనిశ్శబ్దములఁ గోయు ఘూకరావ
మాలపించెడు నా శిథిలాలయంపుఁ
బరిసరమ్ములలోఁ బట్టపగలె నేఁడు
తేరి చూడరు - అడుగిడఁబోరు - ప్రజలు.

ఆ శ్మశానములోఁ గదలాడు అస్థు
లావులింతల నిఁక మూల్గినప్పు డెల్లఁ
గలువరింపుల నా కాళికావధూటి
కాఁటిదేవతగా గజ్జె కదుపుకొనును.

## గు మ్మె ట పా ట

ఆరుబయలున వెన్నెల్లయందు
ఓ పాటగాడా!
ఊరివారందరును గుమి గూడ
నీ సతీమణి గుమ్మెటను మ్రోయ
తందానపదములు
నీవు పాడఁగ గుండె జల్లు మనున్.

వీరసింహము లగు మరాటీల
కత చెప్పుమోయీ!
వెన్నెలలు వే డెక్కునందాక
కరుణరసమున బాలనాగమ్మ
కడగండ్లు తెలుపుమ!
కంటిధారలు పాఱునందాక.

జొన్నకంకుల దోరగింజలను
బిచ్చుకపటాలము
చిన్ని ముక్కులఁ బొడుచు కైవడిని
నీవు తంబుర మీటినపు డెల్ల
నారక్తకణముల
నేవియో మూర్కొనిన యట్లగును.

ఆరుబయలున వెన్నెలలయందు
ఓ పాటదాసరి!
ఊరి వారందఱును గుమి గూడ
నీ సతీమణి గుమ్మెటను మ్రోయ
తందాన పదములు
నీవు పాడిన - నాకుఁ గైపెక్కున్.

# జీ వ సం ధ్య

ఏ కిరాత భయంకరుండో!
ప్రాఁకుకొని జీవితమనోజ్ఞపు
స్వర్ణపంజర మందుఁ బెరిగిన
శారికను డాసెన్.

ఏ నిషాదకరాళ మూర్తియొ!
ఇనుపక త్తెరవ్రేళ్లతో నా
తలిరుఁబ్రాయపుఁ జిలుకపిట్టను
దక్కరించి చనెన్.

ఎవ్వడో రక్కసుఁడు! నా కీ
యెడఁదకోత విధించి బంగరు
పంజరమ్మున జిలుకపిట్టకు
బదులు ఘూక మిడెన్.

పొద్దు పొడుపై జిలుగు వెలుఁగుల
మొలక యగు నా చిలుక తోనే
అమృతహాసము లుషోగీతిక
ల_స్తమించినవి.

సంజపై ముసుఁగిడు తమస్సుల
పుంజమే బ్రతు కగు నులూక
మ్మాశ్వసించె నమంగళపు శో
కాకుతినిస్వనముల్.

పారిజాత ప్రసూనమ్ముల
పరిమళాలుగ విరిసిపోయెను
నాఁటి సురుచిర శారికాంకుర
నవ్యగీతములే.

మొయిలు గొంతున బెల్లగిల్లెడు
భయదనినదాక్రందనములుగ
నేఁడు క్షుద్రదివాంధమే వి
న్పించె విలయముళన్.

నాదు జీవితకావ్యమున గొ్రి
న్ననలుగాఁ జెరలాటలాడిన
మధుర మగు నాశ్వాసపంక్తులు
శిథిలమై పోయెన్.

తొలిప్రభాతపు గీతికల తుది
పలుకు చిఱు మార్మ్రోతతో నవ
కావ్యరచనారంభ మైనను
గలము కదల దహో

# అ ప స్వ ర ము

ఏ హాసనస్వనాలు ప్రవ
హించెనొ! ము న్నొకసారి విశ్వస
మ్మోహనమంజుగీతికలు
మ్రోగిన నాదు విపంచిపైని—నేఁ
డాహసనాలె కారురొద
లై, పదునై, చురకత్తిగీటులై,
నాహృదయాన నెత్తురులు
నాటఁగఁ జిల్లులు షైచి దూసెడిన్.

అల్లనఁ దంత్రులన్ గదపి
నంత, నొకప్పుడు నా విపంచిపైఁ
జల్లని జీవగానము ప్ర
శాంతముగాఁ గురియించి యీ జగం
బుల్లసిలంగఁ జేసె, నిపు
డో! శ్రుతు లెంత బిగించి మీటినన్
దొల్లిఁటి నాదమే మఱుఁగు
దోఁచి యపస్వరముల్ ధ్వనించెడున్.

ఏ సవిలాసరాగ ముద
యించిన వేళలయందొ నా విపం
చీసుధ లాని, నేనె రస
సిద్ధిని బొందితి మున్ను—నాఁటితం
త్రీసముదాయమే యిపుడు
నీరవమై, యొక చిన్ని గీతికో
ల్లాస తరంగ మార్దవపు
లాలన యేని రచింప దేటికో!

మౌనతపస్సులోని వన
మాతను హాయియుయేల నూపుచున్
వేణునికుంజవీధి విని
పించెడు మవ్వపు గీతి వోలె నా
వీణ నదించి, ము న్నెపుడొ
వీనుల విందొనరించినట్టి వి
న్నాణము నాత్మ నద్దుకొని
నా బ్రతు కింకఁ బ్రతిధ్వనింపదో!

ఈ మునిమాపుచీఁకటి వ
హించిన నేనొక చావు కాని యే
దో మరణమ్ము్మనై, పొగులు
త్రోవల జీవన గీతికావళుల్
నా మనసార నింపుకొన
నాదు విపంచిక నందుకొంటి న
య్యో! మృదుతంత్రు లెల్ల ఒక
యూరుపుతోడనె త్రెళ్లిపోయెనే!

7

# ఆహూతి

౧

గాలిమేడలు హిమనగమ్ములఁ
గట్టుకొని నా బ్రతుకు నేఁటికి
గాజుపెంకులు వోలె ముక్కలు
గాఁగఁ జితికినది.

జన్మజన్మ ఫలాశ్రురాసులు
సంతరించిన జలనిధుల నా
తండ్రికోసము, చెల్లికోసము,
తడవి చూచెదను.

నాయనా! యని కంటినెత్తురు
పాయఁ దుడువక మునుపె గుండియ
బ్రద్దలైనది 'చెల్లెలా' యని
బాధ ముంచెత్తన్.

ఈ ప్రపంచగవాక్షముల విడి
యే సుదూరాజ్ఞాత తీరమొ
తూరు పెత్తిన యమృత గోళము
చేరఁ జనినారో!

మృత్యుమందిర కవాటమ్ముల
ఇఞుబంధము లూడి పడెనో!
శూన్య గర్భాలయములోఁ జ
ఞుర్ద్వయము మెఱయన్

ఆ ప్రచండపు నేత్రికీలకు—
ఆ మహోగ్రస్ఫురజ్వాలకు—
శిరము లొగ్గిరి నాదు జనకుఁడు
వర సహోదరియున్.

మృత్యుభవన ప్రాంగణపు టా
దిత్యతీక్ష్ణగ్రీష్మ మస్మత్
సోదరీజనకుల శిరమ్ములఁ
జుంబనము లొత్తెన్.

రక్త కిరణాంకూర చుంబన
సిక్తములు, సాదరపు టచ్చులు,
నవలతాంత వితాన సోపా
నములు పేర్చెనొకో!

పిచ్ఛిలార్ద్రి మధూళికా సుమ
గుచ్ఛముల సోపానశిఖరము
సుందరంబగు మృత్యుకేళీ
మందిరముఁ జూపన్—

నిత్యశాంతికి నిలయ మగు మధు
మృత్యు సుశ్రీవేదికను హ్మా
ద్భవ్యనీరాజనము లిడి ది
వ్యత్వ పావనులై—

శాశ్వతపు జ్యోతిర్విలీన
స్థాణులై, యనలాంశువులుగా
విశ్వతేజము నైక్య మొందిరి
పితయు సోదరియున్.

నేను మాత్రము మిగిలి పోవుచు
నేల కొరిగిన గాలిమేడల
గాజుముక్కలఁ గూడఁదీయుదు
కఱకు కాంతులకై.

౨

ఎండగాడుపు టూదరుల వలె
మండినవి నా మర్త్యమృత్తిక
పిడుచ గట్టిన మడతలందలి
వేడి నిట్టూర్పుల్.

ధ్వాంతమలినశ్యామలము రు
ద్రక్షమానిద్రితవిభూతుల
నొరసికొను కొన ప్రాణముద్రలఁ
జెరపివైచినది.

కరడు గట్టిన కటికచీఁకటి
యురులఁబడి సుడిగాలివలె, పల
యములు గొట్టితి కనులు కుట్టు బి
లాంతరవ్యవధిన్.

కారుటిరుకుల మూల నొదుగుచుఁ
గర్ణపుటముల గుంజివేసెడు
విసపుటీలల కీఁచురాయిగ
కొసరి యేడ్చితిని.

క్రుంగిపోయిన తమశ్శిథిలపు
గుండెఁజీలిచి రుధిరధారలు
పిండి యెగఁజిమ్మితిని గగనము
నిండి తొణుకాడన్.

మింటి కెగసిన శోణితమ్ముల
మెఱుగు గురువులు వాఱు జీరలె
ఉభయసంధ్యా రంజితారుణ
విభవమున గలసెన్.

తరుణ సంధ్యారుణిమ నా సో
దరికిఁ గుంకుమతిలక మద్దెను
చరమ సంధ్యాపుష్పములు నా
ఱనకు నర్పించెన్.

# రెండు లోకాలు

అవి తారలు - యుగాలనుండి
ఆ నిర్జరపథాల నిండు
హసితోదయ సుధాలవాలు

ఇవి హిమకంకణాలు రెండు—
ఈ భవసుమదళాల యందు
ఇంకిన లోచనాల బొట్లు.

అవి మెఱుపులు - ఖగోళమందు
ఆ మొయిళ్ల పనాల నడుమ
అమరద్యుతి విసీలలతలు.

ఇవి త్రుళ్లిన కపాలపంక్తి—
ఈశ్వరిగళ కరాళ వీధి
నింపారిన సరాల మణులు.

అవి సంధ్యాకపోల రుచులు—
ఆర్ద్రరాగరసాలు విసరు
అరుణోజ్జ్వలవిశాలదిశలు

ఇవి నెత్తురు పొలాల గట్లు—
ఈ హృదయము నరాలఁ దొడిచి
ఎగఁబోసిన తరాల చితులు

ఆ లోకము సుధాలయమ్మ!
ఈ లోకము తృణాలయమ్మ!
ఏలా! ఈవిధాల సృష్టి!

## ఓ చె ల్లి !

౧

ఈ చితి యందు నీవు నశి
యించుటకై యిడినారె చిచ్చు? కీ
లాచరణీయ దగ్ధపథ
మం దుదయించిన ధూమరేఖలో
నీ చివురాకు మేను కయ
నించిన వెన్నెలగద్దె బూదిలో
దాఁచిన నల్లపూసగ గ
తమ్మయి పోవునె కానరాకయే?

నీ సుకుమారమూర్తి నొక
నీరవమైన కళేబరమ్ముగాఁ
ద్రోసిరె కారుచిచ్చు టౌడి
లోఁ మసి గాఁగ దహించిపోతివా?
ఈ శిథిలంపుఁ గాష్ఠమున
నెన్నటి కేనియు లేచిరావ? నా
యాసలు నీదు భస్మనిచ
యమ్ములలో వసివాళ్లు వాడునా!

పోయితి వీవు పెట్ట పౌల
మున్ బదునారిన నీటి తేమగాఁ
బోయెను నీ దృగంతరపు
ముత్తెపు రిక్కనెలల్ మనోజ్ఞపున్
గేయము లల్ల నొత్తిగిలు
నీటు హొయల్ వడఁబోసుకొంచు నీ
వాయువులో విలీనమయి
పాసెదు రీతి మదేకసోదరీ!

వాయుహతప్రసూనముగ
వ్రాలిన నీకయి బాష్పబిందు వీ
మాయజగమ్ము రాల్ప, దొరక
మా అయినన్ బరితాపసేచనల్
సేయదు— నాకు మాత్ర మొక
సృష్టివికల్పము నొందె నింక "అ
న్నా!" యని పిల్చు నీ వెలుఁగు
నవ్వుల చెమ్మట లారఁ జెల్లెలా!

జారిన నీతనూమసృణ
చంద్రిక లింకిన కాఁటి ధూళిలో,
నారిన చిచ్చులోఁ బరిమ
ళార్ద్రలవ మ్ముదయించి నాహిమ
ద్వారము తట్టిపోయినదొ!
తామసిఁ జీలుచుకొంచు నేఁగెఁ దే
మారవ కంఠ మెత్తి హృద
య మ్మెటకో అనుజన్మ కోసమై!

గాటపువెన్నెలల్ చెదరి,
కాటుకపూఁతలుగాఁ దమస్సులీ
నాఁటికిఁ జుట్టుకొన్నవి—పు
నఃపరివేదన లొచు నీ వియో
గాటవిలో మహార్తులయి
అర్చిన వీ మలుపచ్చి యైన క
న్నీటి కణాల దొంతరలు
నీ నయనోజ్జ్వలకాంతికోసమై.

చేరెఁడు మంటి పోగ్రివుగ వి
శీర్ణగతిన్ బడియుంటి వీ శ్మశా
నోరుకఠోరవీథి నని
యూర్పులఁ బుచ్చెద— ఎవ్వరేని యీ
దారిని సుంత మోపిన ప
దక్రియ సోఁకునో యేమొ నీహృదం
భోరుహ మంచు, దద్దరిలి
పోయెద నెత్తెలు వాఱు నేలగా!

ఏ నడిరేయినో కలువ
రించిన నీశిథిలాస్థిఖండ మా
శానల జీవితార్తి హృద
యమ్మున నించుక లేచి, మూగకం
ఠాన వెలుంగు దారికయి
నర్మజప మ్మొనరించునో! దరి
ద్రాణనిరంతరోదిత హ
లాహల మూఁదిన వల్లకాఁటిలో!

ఈ చిఱుగాలి ధార మయి
యింతకు మున్నె పరిభ్రమించి ఝం
ఝూచితశైత్యసంహతి న
నంతవిహార దిగంతరాళమై
వీచెను గాక – శుష్కహిమ
వీథుల నీవటు పండినావు, నే
నో చిరదుఃఖతాపమున
నుక్కిరి బిక్కిరిగా శ్రమింపఁగన్

ఇపు డొక రక్తవీచి పెక
లించిన నాకను లిల్లె బొత్తలై
రెపరెప లాడి, శూన్యనిబి
రీస నిశాంధ తమస్సు జీవితాం
తపుఁదుది ప్రాణవాయువులఁ
దాఁకిన దాఁక శిలాద్రవంపు టూ
రుపు నయి 'చెల్లెలా!' యనెడు
రోదన మెక్కెటె నింతు రోదసిన్.

ఏ పొదరింటఁ గెందళకు
లీనిన లేఁత చివుళ్ల గూటిలోఁ
దీపులు చేదివైచు పగి
దిన్ సెల లూరెడు తేనె బుగ్గయా
పూపపసిండి పూఁజెలువ
మున్ మొద లంటఁగఁ ద్రుంచినానొ! ఆ
పాపఫలమ్మె నేఁటి కెడఁ
బాటుగ నన్ను గ్రసించెఁ జెల్లెలా!

౨

నీవు శుభాంగలీల నవ
నిస్ బసినవ్వుల నాడుకొన్న వే
ళావికచోత్సవమ్ముల ద
రస్మితులై "చిరకాల భాగ్యపుం
బ్రోవుల పంట" వంచుఁ దల
పోయుచుఁ బల్కిరి అందఱంద ఱా
దీవన లెందుఁ బోయెఁ గొనఁ
దేరని వెట్టిగఁ గొంతికోర్కెలై

అమృతవికాస మొల్కు దివి
జాంగనగా నిను నత్తవారి గే
హమునకుఁ బంపి, నీదు పున
రాగమపూర్ణశరత్తు వేయి నే
త్రములఁ బదేపదే యెదురు
దారులఁ గాచిన మాతృదేవి నీ
చ మగు శ్మశానపుం దహన
శాలకు నేఁడనుపంగ వచ్చెనే!

మూఁతలు వడ్డ నీదు మొగ
మున్ గడసారిగఁ జాఁచి, నీరో
జాతములన్ నఖాంచలపు
స్పర్శలతోఁ దడవాడి, మౌనపున్
బాఁతరలైన యశ్రుల క
ణమ్ముల నంత్యపుఁ గాన్కఁగాఁ గృశీ
భూతములైన కన్గొనల
మోసెను పో మన కన్నతల్లియే!

పలుకులు నోటరాని పసి
పాపను మాయఱచేత నుంచి, పూ
వులరథ మెక్కినట్లు పసు
పుంబసఁ దొందొణుకాడు తోరపుం
జెలువముతోడఁ బాడె పయిఁ
జేరుచు, నెచ్చట కా ప్రయాణమో
తెలుపక యేఁగినావు — వెను
దిక్కునె చూడఁగఁ బోవః చెల్లెలా!



ఆ యరుదేరు ముద్ద జవరాండ్రు తనూజలఁ జంక నెత్తి...

ఏ కలుషంపువేదనల
నేని యెఱుంగని బొమ్మలాట లం
దీ కసుగందుమోము హసి
యింపఁగ, మా హృదయాల నేల అ
స్తోకవిషాదసంకలిత
తోయదముల్ సుడు లెత్తి నింపఁ బెం
జీఁకటిగుంపుః పంచు తడిఁ
జేసిన దోనెలు గాఁగ నేత్రిముల్ -

ఆయరుదేరు ముద్దజవ
రాండ్రు తనూజలఁ జంక నెత్తి, దీ
ర్ఘాయతమైన సువ్రితము
సాంతము కోసము పేరటాండ్ర కేల్
సాయము గోరి పిల్వఁ గను
లన్ బొడఁగట్టిన స్వప్న మేదియో
యూయెల లూపఁ దన్మయత
నొందుచు నీ పసికూన నిల్చెడున్,

౩

పచ్చికపోచ కీలు కదు
పస్ శివ మెత్తెడు సూదిగుందెతో
అచ్చరపాట తేనియల
నద్దిన యట్లు, శిరీషభావముల్
పచ్చిగఁ జేపు గీతి వయి
పాడితి వంబరవీథి నేఁటి కా
వెచ్చని దోరపాట విని
పింపదు, కాటిని దాఁగిపోయెనా ?

మసకలుగాఁ గసీనికల
మబ్బులపైఁ బొర గ్రిమ్ము బాష్పపున్
గొసల వితాన నీ నిసలఁ
గొర్రిస్నెలవెన్నెల లందు దృక్కు-లే
మసలని గాలిదారుల, న
మాయకపుం బికకన్య యొంటి నే
దెసనొ కుహూ యనంగ, నలు
దిక్కు-లు నీకయి పూతుఁ జెల్లెలా !

ఈనెలయేటి పాయ మన
యిద్దఱకున్ బ్రియమై విదగ్ధ గీ
తాసరళానుభావ భరి
త మ్మయి నెయ్యము గ్రుమ్మరింపఁగా—
ఈ సితసైకతస్థలుల
నెన్ని పదమ్ములో పాడినాము ; నేఁ
డీ సలిలమ్ము లేల చెమ
రింపవు తొల్లిటి శోభ చెల్లెలా !

నీ రతనంపు దోసిటను
నీరము లల్లన నొల్కఁబోయ, నా
క్షీరముఁ గ్రోలి తీయ మొలి
కించిన యీ విరిఁదోటలోఁ గళా
స్ఫారకకాంతు లీనిన పు
వుల్ కరుణాశ్రువు లయ్యె నేఁడు-ముం
జూరున నంటిపెట్టుకొను
చొంగలులోఁ గొసవాన బొట్లుగా!

౪

మ న్నయినావు నీ వని అ
మంగళ బాష్పకణమ్మ లేల? నా
చిన్ని యనుంగుఁజెల్లెల ! ని
శీథిని దూసిన చుక్కవోలె నే
పున్నెపుఁద్రోవనే యెగసి
పోతివా! కన్నుల కందరాని యే
కిన్నెరతీగెవై యమృత
గీతి నివాళిగ వెళ్లిపోతివో !

ఈ వలిరేయి నాత్మబలి
నింత సమర్పణ చేసికొన్న నా
జీవితమార్గమందు వికసింపఁగఁ జేతువా! నీ యనంత కాం
త్యావిలమైన ప్రేమ ! ముని
నర్జుననిన్ జరితార్థుఁ జేయు గీ
తా విదితార్థపూత మగు
తత్త్వముఁ బోలి సుధామరీచివై!

# క్రీనీడలు

దీపంపు సెమ్మెపై
        దేదీప్యమానమై
పసిడి పచ్చని వెలుఁగు
        పకపకా నవ్వినది

క్రీనీడ పాయలోఁ
        గెవ్వు మని కేకొకటి
వినిపించి తుదిశ్రుతుల
        విరమించిపోయినది.

నీడలోఁ బారాడు
        నీలి కనుపాపలోఁ
గన్నీటి చిను కొకటి
        కదలినది, మూల్గినది

అంతరాళము నందు
　　నణువణువులై చెదరి
అవి యెవియొ దిగులుతో
　　నదరినవి, బెదరినవి.

ప్రమిదలో నుడివోని
　　హిమకాంతికళిక యే
చలనమ్ము లేక స్మిత
　　చంద్రికలు జార్చినది.

*

పొదలోని వెలుతురుగఁ
　　జదలందు వెన్నెలగ
మిణుఁగురో! తారకో!
　　మెఱసినది, మురిసినది.

పొదచాటు నీడలోఁ
　　బుఱు కొకటి బుగ్గిలోఁ
బొరలినది — భయముతోఁ
　　బులుఁ గొకటి యార్చినది.

పొదలోని మెఱపులకుఁ
　　జదలందు వెన్నెలకు
ఆ వింత భయమేమొ
　　అర్థమే కాలేదు.

*

పొదవెనుకఁ జితి యొకటి
　　పొగిలినది - కుమిలినది -
కాలిన శవ మొకటి
　　ధూళిలో రాలినది.

విశ్వ నిస్వన వీథి
　　వేఁడి నిట్టూర్పొకటి
తరఁగ వలె లేచినది
　　తల్లడిలి పోయినది.

మిణుఁగు రల్లే మెఱసి
　　గొనబుగా నాడినది
చుక్క క్రిందకుఁ జూచి
　　పక్కు మని నవ్వినది

# తమశ్శ్వాసనము

ఈ యమయాతని దస్సి, కృశి
యించిన బొంగురుగొంతు విచ్చి, యీ
రేయి యెడందలో జలద
రింపులు మీటుచు నేడ్చినాను — నా
తీయని యేడ్పుకే యిరుల
తీవ్రపు టూర్పులతో నిశీథి నన్
బాయక నిల్చిపోయినది,
నా తిమిరస్స్వర మాలకించుచున్.

నా నిశితాంధగీతికలు
నారకపుంబొలిమేరఁ దామసీ
సానువు లెత్తిపోయి మడి
జల్లుల మున్కలు దేరి వచ్చు ప్ర
స్థానమహోదయాన బెడి
దమ్మగు శాసనమున్ విధించుకొ
న్నాను విభావరీ విషమ
నాటికలోఁ దొలిరంగ మేర్పడన్.

ఈ తిమిరావలోకనము
నింత సహించుచు నిందు వేదనా
ఖాతసుఖమ్ము వోలె నొక
గాఢ సుషుప్తిని ఱెప్ప మూసి, ని
ద్రాతమపుం గవోష్ణ రుధి
రమ్ములు జుట్టితి—నాఁటి నుండి శీ
తాతప శుక్లపక్ష గళి
తామృత నిమ్నగలే రుచింపవో!

ఎపు డెపుడో నభమ్ము విరి
యించిన బంగరు పూవులో, మనో
జ్ఞపు టుడులో, స్రవించిన ర
సజ్ఞత యాతిమిరప్రవాసి శూ
న్యపు టెద కే వికాస చల
నమ్మయినన్ మలయింప లేక మాం
ద్యపు ముది తావి యై తమపుఁ
బ్రాంగణ సీమనె మాసిపోయెనో!

ఒక కిరణమ్ము సంస్కరణ
మూనని సుప్త తమస్సమాధి స్వా
ప్నిక చకితాంకితమ్ములుగ
నీలి గవాక్షము నుండి కౌముదీ
శకలము లెవ్వరో దిగియఁ
జార్చిరి— నాయొడిఁ బట్టు నంతలో
వికలములై నశించినవి
విస్మృతి ధూళిని రాలిపోవుచున్

నే నిటు లెంత దాక రజ
నీశ్వసనమ్ముల సుప్తరాగ రే
ఖానిలకోటినై యెడఁద
కందని గాటపు లోఁతులన్ దమో
యానముతో మృషాపథము
లందొక ముక్త విషాద బాష్పపున్
రేణువుగా నెటో హిమవి
లీన నిగూఢతలోఁ జరింతునో!

## ప్రౌఢు

తైలసంస్కార శూన్యమై, దర్భ లగుచు
బిఱ్ఱ బిగిసిన ఒక నిరుపేద రాలి
చికురముల వోలె సంపదఁ జిదుముకొనిన
నగ్నశాఖల నవయుచున్నావ ప్రౌఢ !

నీ వాకప్పుడు శ్రావణ నీరదంపుఁ
గన్ను సన్నల తెలి తొలకరుల సిగ్గు
కళలఁ దఱకొత్త లేదె ? నక్షత్రచకిత
రత్న భూషిత నీలాంబరమ్ము వోలె !

అపుడు నీదు కలంకారి యద్దకంపుఁ
జీర చెఱఁగున బయకారి సిరిబిడారు
పాలకడవల పొర్లింత పాఱుదలగ
నౌసు వెదఁ జల్లి దోఁబూచు లాడలేదె ?

కుచ్చె తీసినట్టి కిరీటిపచ్చ వోలె
తొలిరజస్వల వగు నాఁటి తలిరుటాకు
చందమామ గుక్కిళ్ల పసందు చిందు
లుట్టిపడవేల నేఁ డొట్టు పెట్టి నట్లు ?

కలరవము నింపి, పికిలి పిట్టలు త్వదీయ
సవిధ తౌర్యత్రికపుఁగళాశాల యందు
సరిగమలు నేర్చు నొకనాఁటి మఱవరాని
గరిమ నా దృష్టులను శిలాక్షరము లునిచె.

కాని పాపిష్ఠి దుర్విధి ఘాతుకమున
కెంత యొడిఁగట్టి, యింతలో నెంత చేసి
పోయెనే నీదు సౌభాగ్యమును హరించి–
మొండి చేతులు సాచి వాపోవు దిపుడు !

నాఁడు ని న్నాశ్రయించి అనాధ యైన
నిండు చూలాలు నీళ్లాడ, నీవు కరుణఁ
బురుడు వోసిన పుట్టెఁడు ముచ్చటలను
నెమరువేతువ స్వప్నలోకమున నేఁడు ?

ఈ దయాశూన్య జగతి బహిష్కరించు
కడుపు కాలిన వట్టి బికారి దండు
శీతల స్పర్శ నాదరించిన ఫలమ్మె
నేఁటి కీ దిక్కుమాలిన పాటు నీకు ?

పచ్చగా నీవు బ్రతికిన పర్వదినము
లందు శిల్పులు కవులు నీ యంద మరసి
ముగ్ధులైనారు— నేఁడొక్క పురుగు గాని
నిన్నుఁ గని జాలికన్నీరు నింప దకట !

తెనుఁగు కీర్తిప్రవాళదీప్తిని సమస్త
వనధులను దాఁటిపోవ రవాణ చేసి
కాలవశమున ననదమై తూలియున్న
ఆంధ్ర రాజ్యేందిరను బోలు దమ్మ నీవు !

ఎఱుక యున్నదె ? విరజాజి సరులు జార్చు
కోసినవ్వుల గాదెలు వోసి, నీ శు
భాంగణము నాటపాటల భంగిమములఁ
జెలఁగినాము సీతాకోకచిలుక లట్లు.

మఱచిపోతివె అలనాఁటి తరుణవేళ
నీవు కళ్యాణమూర్తివై నిలుపు కొన్న
చిత్ర చిత్రిత సౌవర్ణ పత్ర రేఖ
లద్దుకొను చిట్టి చుట్టాల మైన మమ్మ ?

క్రమ్ముకొని వచ్చు సందెచీఁకటుల మేము
మధురఖేలనముల నింటిమాట నాద
మఱచి యుండఁగ, మిణుగురు పురుగు కనుల
విచ్చితివి గాదె లక్షదీపికలు నాఁడు !

జ్ఞాపకము లేదె నీదు వక్షమ్ము నందు
నెలమి నా ముద్దుచెల్లెలు పలుచయైన
గోటిగీటుల నెలవంక గురుతు లిడిన
లేఁత వెన్నెల పండువు కౌతుకములు ?

మురిపెముల మూట నా తోడఁబుట్టు వపుడె
మమ్ము విడనాడి నాన్నతో మరలి యిటకు
రాని యెచ్చోటికో పోయె, మానికమును
బోలు చిన్నారి పొన్నారి బుడుత నిచ్చి.

తొడిమ వీడిన పూఁగన్నె దుఃఖమునకె
కలఁగి నట్టి ఆ నవనీత కరుణరాశి
నీవు పడియున్న నేఁటి దుర్నియతి కెంత
కుమిలి యుండునో విహ్వాలత్వమును గాంచి

... ...

నీవలెనె మ్రోడునై యున్న నేను బాష్ప
నదములను గట్టి, నీదు కట్టెదుట నిల్వ—
ఈ శరీరము నుండి బహిర్గత మయి
శల్యపంజర మిట్టె సాక్షాత్కరించు.

# మంచు మంట

నా బ్రతుకు దుర్వ్యవస్థాకమై, నన్ను నేనె
ఆహుతి నొనర్చు ఈ మిశ్రమాంక మందు
వేడి రుధిరాల కీలలు విరియు చోట
మంచు గడ్డల చాలును నించుకొనియె!

భగ్గుభగ్గున మందు నా బ్రతుకు లోని
శతసహస్రాస్రకీలాప్రసారమందు
మోదతృణములె పొడసూపఁ బోవునేని
భస్మరాసులుగా రాలిపడును దేవ!

మాఘమాసపు శీతల మారుతములఁ
గొరడు వోవు నా మిహికావగుంఠనంపు
బ్రతుకులోఁ గరుణరసమ్మె ప్రాకునేని
ఘనఘనీభవ మగు మంచుగడ్డ యగును.

## క సి

ఓసి హింసాప్రపంచమా ! ఖాసురంపుఁ
గళలఁ బొదిగెడు సౌందర్య కణము లగుచు
ఆ నిరంజన వాయు పథాన లలిత
పుష్పదళముల పర్యంకముల హసించు
తారకాప్రేమమూర్తుల సౌరు లార
గింపగా నన్నుఁ జూచి సహింప లేని
కనుల యెఱుపుల నుండి రాక్షసపుఁ జిచ్చు
లేల విసరుచు ద్వేషింతు వేల నన్ను?

ఇవురు వోసిన సౌందర్య తృష్ణ వ్రేఁగి
అంత యాకొన్న నా హృదయముఁ గరంచి,
వికట పరిహాసముల నాసపెట్ట నెంచు
నీ నికృష్టపు మృగతృష్ణ లీను పూతి
పరిమళస్వాగతములకు స్వస్తి చెప్పి,

అమర శైవాలినీమరందములు చిలుకు
అమృత బిందువులను బ్రయాసమున నేరి
నింపు కొంటిని యెడదఁ దెందెప్పలుగను—

కాని నా సుధాస్పర్శ నీ కర్కశంపు
టూహలకు నెంత కసి దిద్దెనో ! కరాళ
కశ్మల మ్మగు పైశాచ కరము లొడిచి,
నిండు జవ్వనపు న్నిగనిగలఁ దోఁగి
రసభరితమైన నా యంతరమ్ము లోని
చిఱుత తరఁగలఁ గలవర పఱచి, రేఁగఁ
గొట్టితి—భయంకరోత్తుంగ కుటిల సాగ
రోర్మికలుగ విజృంభించి, యుబికి యుబికి,
లేచి పడి పోవు దాక—

ఆవీచికలను

నిలుపుకొనలేక, కనుఁ గొలంకులను జార
విడిచితిని బాష్పధారలై పుడమి నంటి
మంటి నింకెడు వఱకు—క్షమమ్ము వోలె
క్రుంగి, క్రుంగి, మదీయ హృత్కుహర మిపుడు

భూరిపాషాణ కాఠిన్యమును మిగిల్చి
యెండి యెండి, శుష్కించిపోయినది – అమృత
జీవనపు శోభలను బాసి, ఆవినిర్మ
లార్ద్రి కళల జ్యోతిఃపథ మ్మవలఁ దోసి.

ఓసి క్షోదిష్ఠలోకమా ! యుష్మదీయ
నైజహింసాప్రవృత్తి కంతమ్మె లేదె?
ఒక్క కన్నీటి చుక్కైన నొలకఁబోయు
పలుచ తడి యేని లేక నాపాడుగుండె
డిల్లవడి యుండ నింకఁ బీడింతువేల?

ఇట్టి కలగుండు వడిన నా యెండుటెడద
నుద్భవించుచునున్న వత్యుగ్రదహన
కీలికామాలలేవా ! పాతాల ఖనుల
రోహిత జ్వాల లేవా !

# కలీ!

కాల మ్మను నౌక కూలంకషమునఁ
దరంగమ్మృదంగ ఝరంపు టురాన
ననంత మధు కంకణమ్ము వలెనే
హాయిగ యానము సేయుచు నెటకో
ఊహల కందని రహఃప్రశాంతపుఁ
దీరపు నెలవులు చేరక మునుపే
వలగొని క్రిందికి బలమున లాగితివా ?
న న్నొక
సుడిగుండమ్మున బడఁబోఁ ద్రోసితివా ?
దుర్గతి నియతీ !
దుష్కాలి ! ఓకలి !

ప్రపంచమను నొక జపాపుష్పసూనపుఁ
బరీమళమునకుఁ బరాజితుఁడనై
ద్విరేఫముగ నల మరందధారల
సుధారసము నా అధరపు టంచుల
ముడిముడి తడిగాఁ దడపక మునుపే,
తీయని వాంఛలు తీరక మునుపే,
విషబిందువు నా పెదవులఁ బూసితివా?

న గ్గని
వికృత హాస్యముల, వెక్కిరించినావా?

కృత్రిమ వర్తీ!
చిత్రమవు కలీ!

ప్రకృతికి జీవన వికసన మిచ్చెడు
మధుమాసపు సంబరమున నెగయుచుఁ
దేనెలు పితికిన తీయని రుతముల
గానామృత లహరీ నిమగ్నునై
చిన్ని పికముగాఁ జివురు కుంచెతో
చిన్నెలు వన్నెలు చిత్రింపఁగనే

హేమంతమ వయి యెగిరి వచ్చినావా ?
పూవుల
గొడుగు సొంపుపై నడుగు పెట్టినావా ?
అసూయ బుద్ధీ !
అపకారి! కలీ

సంధ్యాసవితలు జల్లు నిగారపుఁ
దళుకు టలలలోఁ గిలకిల నవ్వుచు
లేఁత పసల మల్లీ ప్రసవము నై
లోతులు తిరిగిన శ్వేతహృదయమును
ధగధగ మని యీ జగతికి విప్పుచు
కళాస్వప్నములఁ గరఁగి పోవు నెడ
నల్లని చీఁకటి యల్లికవైనావా ?
నా దగు
నుల్లాసమ్మును గొల్లగొట్టినావా ?
మాలిన్యఖనీ !
సిలిమవుఁ గలీ !

అధమమ్మగు నీ పృథివీవీక్షణ
శృంఖల విడివడి చిన్మయపథమున
నునుమబ్బుల తెలితునుకల తొనలకుఁ
జికిలి పెట్టు క్రౌంజిలుగు రిక్కనై,
నటత్కాలికగా నవజ్యోతిగా
వెలిగి, వలవు దివ్వెలు రగిలింపఁగ
గాలనియతివై కాలఁ దన్నినావా?
నేలకు
గిరివాటు వడన్ దరుమఁ గొట్టినావా?

నిర్దయ మూర్తీ!
నీచా! దుష్కాలి!

విశ్వవాయుహిమ వీచీముఖమున
హాయి పెన్నిధుల చాయల నొదుగుచు
నభ్రవిహార విహంగమునై స్వే
చ్ఛాగమనమ్మును సలుపుకొనుచు నే
నైసర్గిక సౌందర్య గర్భమున
విరిసినహ రువుగ మెఱసిపోవగాఁ

గఱకు బాణముల గురిని జూచినావా ?
నా దగు
తరుణహృదయమున వరుసఁ బఱపినావా !
కిరాతమూ ర్తీ!
కిల్బిషపుఁ గలీ !

అసువుల మాడ్చెడు విసపు ఔండలో
వాడిన వల్లిక వలెఁ బోడిమి చెడి,
ఆశాంచలముల నలమిన ఆశా
జలదము తొలకరి జల్లును గురియఁగ
నుత్సాహంపు నవోన్మిషితమ్మై
అణువణువున నా తనువు పుల్కలిడ—
రక్తజ్వాలోద్రిక్తప్రళయము వై
భీషణ
కనదగ్నుల వృష్టిని గురిపించితివా ?
కాపట్య మతీ !
కలుషాంధకలీ !

కరుణ భిక్షయే యెఱుగని లోకము
నా వెతలకు నింధనములు చేర్పఁగ
శీతలాశ్రువుల శీకరముల నా
యంతర్గత దావానల మార్పుచు
నా జీవితమును నడిపిన తండ్రిని
నను నోదార్చిన అనుంగు చెల్లిని
దేగ తన్నుకొని యేఁగిన నేరుపుతో
త్రుటిలో
మాయదారివై మంట గలిపినావా ?
నాశనకారీ !
నరహంతకలీ !

మ్రొక్కులు ముడుపులు పూజ లందుకొని
రాతివేల్పు నేత్రముల నిప్పుకలె
అటు నిటు దరియుచు, అరులై అదుముచు,
జీవనసుమమును జిదుమ నెంచఁగా
దుర్గమ మగు నా దుఃఖపు గవనిని
కవోష్ణబాష్పపుఁ గవచము ధరింప

నను విడనాడక నా హృత్కోశములో
నెలకొని
నెత్తురు నాడులు కత్తిరించినావా?
రక్తపిపాసీ!
రక్కసీ! కలీ!

మ్రాను తొఱ్ఱలో మాలకాకి వలె
మోడు జీవితపు గూడు కట్టుకొని
పుంజికొనిన యేడ్పుల నెగయూర్పులఁ
గ్రుంగిపోవు బ్రతుకును గుదించుచును
నా నిస్పృహలో నాలో నేనే
వెతల సుద్దులను వెళ్లఁబోసుకొన
బావురు పిల్లిగఁ బంచపంచ లందే
చల్లగఁ
బొంచి పయింబడఁబోవ నిల్చినావా?
దుష్టభూతమా!
ధూమకేతువా!

నీ కృత్యమునకు నియమమె లేదా?
నీ తృష్ణకు సంతృప్తియె లేదా ?
ప్రాతర్హాస విలాసమె రాదా ?
రుద్రస్వామియె నిద్రవోయెనా ?



ఓయి తాండవ చక్రవర్తీ!...

I

# రేణువు

ఓయి తాండవ చక్రవర్తీ! యనంత
భువనముల సృష్టి నీ నృత్యమునఁ గడంగి
ఉజ్జ్వలోద్వేల ఫణముల నొాగిని విప్ప
సచ్చిదానంద మగు తొలి జాము నందు
నిఖిలలోకాల కుక్షిలో నీ విశిష్ట
కాంతి నిర్యత్స్ఫాటికంపు సుషమ
ధ్వనిగ ధ్వనిగాఁ బ్రతిధ్వని పలికి పలికి
కదలి యాడఁగ – ఉన్మాద కళిక వొచు,
అగ్నివీణలు పాణితలాంతరాన
వెడల, జ్వాలాతరంగాల వేణి జార;
రోదసీ భ్రామ్యమాణ నిర్గుణ రహఃప్ర
శస్తి జోహారు లిడ నుదయాస్తమయపు

టరుణ తేజశ్ఛయ మ్మేక మయిన యట్లు
విశ్వతాండవ కేళీ నవీన విలస
నంపు రంహః ప్రవృత్తితోఁ గెంపు గజ్జి
యల ధగద్ధగలతో నాట్యమాడి, ఆడి,
తన్మయత లీనమైనావు –

తావకీన
విస్ఫురత్కల్యనాట్య శోభిత పరాగ
పటలి నిబిడీకృత మ్మయి, ప్రకటితాసి
తచ్ఛవుల రేపుకొనుచు, నధఃపతనపు
గమన వృత్త్యవలంబివై, కనులె చొరని
భీకర ధ్వాంత శృంఖలానీక మలిన
వాటికాకూప నరక గహ్వరము లందు
బంధితమ్మౌచు, నాఁటి దివ్యక్షణంపు
నృత్త పదయుగ చ్యుత కమనీయతర వి
లాసచంద్రికా సౌకుమార్యమును బాసి
చీఁకువడి చిమ్మచీఁకటి రేకలందు
వ్యథలమడుగులఁ జుమ్మలు వాఱుచుండు –

ఆ తమః క్రాంతధూళిలో నణఁగి యొక్క
మూల చీఁకటిరేకలోఁ బొగిలి పొగిలి
సాన వెట్టిన కారురూపాన నేను
జీరుకాడుచు నుందు నేదారి లేక.
ఈ యధోలోక కృష్ణాంధ హృదయమందు
హోరు మను ధూళి సంద్రపు టూర్మికలను
గలవరపు నీలిబొట్టుగఁ గ్రాఁగి, దృక్ప
థమ్ముసకె అందనట్టి అత్యల్ప మైన
పరమ పరమాణువుగ నేను దొరలుచుందు

కాని యీ కారు రేణు వాకారమందె
యిమిడి యున్నవి కాష్ఠాలు కుములుచున్న
అగ్నికుండము లెన్నొ! బ్రహ్మాండభాండ
భేదకములై పెఠిల్లని పాదు కదిపి
ప్రజ్వలిత మగు నగ్నిపర్వతము లెన్నొ!
ఇన్ని బడబాగ్ని శిఖలు నా హృదయవర్తి
దాచుకొని, విశ్వపరివేష్టితపు నభోంత
రాళ నీరంధ్రహాలహాలమ్ము నీదు
గళము నొక చిన్ని మచ్చయై కనలినట్లు

నల్లవడి, నల్లవడి, చిరునలుసుగాఁ జ
లించి రేణువై యిండె క్రుళ్లినది దేవ!

ఓయి నటరాజ! కోటిఖద్యోతమూర్తి!
ధవళనీరేజ కింజల్క ధౌతమైన
భవ్యభవదీయ చరణ సంభావ నృత్త
విస్తృతోద్ధూత దివిజ దీపిత పరాగ
సంతతికి నారకంపు టనంతశర్వ
రీ నిశాంత నివాస నిర్ణీతి యేల?

అంటినం జాలు, వీడని అంధకార
శిథిల హృదయానఁ బడిన యీ చిఱుతరేణు
వున విశాల శోకదహన భువన మొకటి
యెడతెగని చిచ్చు రగిలించు నేల ప్రభువ?

ఓయి దేవాధిదేవ! నీ యీ యనన్య
పుణ్యతమ పూజితాంఘ్రులఁ బులకరించు
ఈ దుమారమె నీ సృష్టియేని అందుఁ
జెలఁగి రేఁగిన ఈ ప్రతిసృష్టి యేమి?

# మ ధు వా స న

అది — ఉషోరాజ్ఞి యగు
నందాల దొరసాని
ఆ తూర్పు సంద్రాన
నద్దాల సౌధాన
నేడు వన్నెల వీణ
నింపు మీటినవేళ !

మంద మధురస్మితలు
మందార మదవతులు
నందివర్ధన సతులు
వందిమాగధ నుతులఁ
గైవార మొనరించి
కమ్మఁదన మొలికించిరి—

సుమనాల హాసనాల
విమల ముక్తాశ్రీలు
సెలయేటి మిలమిలల
పలుచ నటనముల వలె
విరిసినవి, జిగిసోన
కురిసినవి, నా లోన
విరిసెజ్జ జలతారు
వెండి యీనెలు జారెను—

... ...

ఇది—శపాదేవి యగు
నినుప గజ్జెల జీవి
యీ గ్రుడ్డి శకటంపు
టిరుసు కందెన సొంపు
తురుముకొని తన కురుల
యిరులు పులిమిన వేళ!

పూలతొంగలి కనులఁ
బాలారు నవమణులు,

దళముదళముల విరిసి
వెలుగు తుటముల బెరయు
తరిపి మీఁగడ తేట
తళుకలును గనరావు
విరిసెజ్జలో మెఱుపు
దరిసెనమె నశియించెను—

తామసీ కుహరాల
సౌమనస్యము రాల్చి
పూవుపొత్తిళ్ల మసి
ముద్దలై నుసి నుమిసె,
నా డెందమున నీలి
నీడ లల్లన వ్రాలెను—

... ...

ఆః ఇవేమి! ప్రకంపి
తాంధకారమ్ములోఁ
బ్రసవ జీవనశోభ
భస్మీకృతమ్మైన

చితినుండి లేచినవి
అతిమధుర వాసనలు—
చిమ్మచీఁకటి కోనఁ
జీల్చుకొని, నా లోని
ప్రతి రక్త నాళమున
తత సౌరభమ్ములే
శ్రావ్య గీతాంకుర
స్పర్శలుగఁ గ్రేళ్లటికెను—

ఉదయ కాంతులఁ బూవు
పెద విచ్చి, అందాలు
విరఁబోసి, నా కనుల
మెఱపు లద్దిన వేళ
బాహ్య సౌందర్యమును
బరికించితిని — కాని
అంతర్విలీన కుసు
మార్ద్రమధు సురభిళము
సుంతయేనియు నాదు
స్వాంతమున దోఁచలేదు—

ఇపుడు చాయల కునుకు
లీ యిరులలోఁ బెనచి
కోమల మ్మగు సిరులఁ
గోలుపోయిన విరులు
నా కన్నులకు మౌన
శోక మిడినవి — కాని
అవి యేవొ! కనరాని
అమర పరిమళములై
తొణఁకినవి — నా లోన
నణఁగి సుప్తిని గన్న
యే పురాస్మృతులనో
లేపినవి, రేఁపినవి—
కాలాంధకారాన
గలసి పోయిన ప్రేమ
మూర్తు లీ తిమిరంపుఁ
బూల నెత్తావిలో
నిశ్వసించిరొ యేమొ
నిర్మల మ్మగు ప్రేమను!

# తా రా మై త్రి

ఏ కమనీయ నేత్ర మొలి
కించిన బాష్పకణమ్మువో, సుధా
శ్రీకర మౌక్తికమ్ము వలెఁ
జేరితివా గగనాన శ్యామళో
భాకృతి శర్వరీ కువల
యాక్షి దృగంచల చంచలప్రభా
శీకరమో, వివిక్తమధు
శీర్షికమో యనఁ దారకాప్రియా !

ఓ కరుణార్ద్రహృదేవి! యెదియో
సౌనమై, భవదార్ద్రిరోచి ఆ
శా కలితాణువో మొనలు
సాచిన శైశిర చందనమ్మొ నా
శోక మలీమసంపు ఎద
సోకఁగఁ జేయుచు, నాకు నీకు బం
ధీకృత మైన యే చెలిమి
తీవలనో బిగియించి వైచెడున్!

నాకుఁ బురాకృతమ్ము వల
నన్ భవదీయ సువర్ణ మూర్తితోఁ
జేకురినట్టి యీ చెలిమి
చేత విషాదవియోగ గీతినై
నీ కొాక కార్యభారమును
నే నియమింపఁగఁ బూనుకొంటిఁ జిం
తాకునకేని పోలని మ
హాల్పతర మ్మది నీ వొానర్చుచో!

ఈ నయనాల నుండి స్రవి
యించిన యుష్ణపు టశ్రువారి ధా
రానిచయమ్మె మేఘ శక
లమ్మయి, లాఘవలాస్యవృత్తి ద్యో
యానము సల్పి నీ రుచిర
హాసకపోలముఁ దట్టిపోయెఁ గా
దా! నవకాంతికోరకమ
వై చదలందు రహించు తారకా!

ఆ జలదప్రతోళి పయి
యానము సల్పి మదీయ సోదరీ
తేజము గాని నాజనకు
తీవ్ర వికాసము గాని నీల పా
ళీ జనితస్వరూప మయి
రేఁగిన మింటి రజస్సులోని వి
భ్రాజిత పుష్యరాగమణు
లన్ వెదుకాడి కనుంగొనం గదే!

ఆయెడ నొక్కచోట నర
యం దగు నల్లని మబ్బుబిళ్లలో
నా యనుజన్మ ముగ్ధనయ
న ద్యుతులే జ్వలితమ్ములై న శం
పాయత మంజు నర్తనము
లై, యొకసారి తళుక్కు మంచు పై
హాయసవీథి నంతయును
నార్ద్రము చేయుట లేదె తారకా !

ఆ హిమకందరాల మసృ
ణామృతధౌత విధూపలాచ్ఛళ
య్యాహసిత ప్రసూనముగ
యామవతీ తరుణాంశు రేఖికా
మోహభరేక్షణాల యర
మోడ్పుల యోగసమాధి నున్న స్వ
ర్గాహితమూర్తి నా జనకు
నారయలేవ సుధాంశుమోహినీ !

నీ సౌహిత్యము గు_ర్తెఱింగి యిదిగో!
నీయాత్మ కందింతు నా
వేళస్పందన భావధాత్రి యగు హృ
ద్వీథిన్ దువాళించు పూ
జాసామగ్రి, రసోల్బణప్రసవ బా
ష్పప్రేమహారమ్ము — ఈ
నా సందేశపు టశ్రుమాలఁ గొని, సం
దర్శింపు మా దివ్యులన్

# విక్రమ

విక్రమా ! ఓ విక్రమోత్థిత
చక్రఘోషిత వర్షమా! నీ
చంక్రమమ్ముల విస్ఫులింగ
చ్ఛటలు భువి నిండెన్.

పాంచభౌతిక శక్తులే యిరు
పంచలను వింజామరములై
ప్రస్తరింపఁగఁ గదలినవి నీ
రథరథాంగములు.

మొయిలు కడుపును జించుకొని యీ
పుడమిప్రేవుల లోనఁ జొచ్చెడు
చిచ్చుపిడుగుల యారభటితో
వచ్చె నీ రథము.

దళితమానవ కబంధమ్ముల
గళిత మగు నెత్తురుల పంకము
లందు నీ స్యందనపు గుర్తులు
చిందులాడినవి.

జంట దిరిసెనపూలుగా నీ
కంటిమంటలు మెఱయ, బొమముడి
నంటె సిందూరముగ నార్తుల
యరుణశోణితము

క్రథనకేళిం జెలంగునీ య
క్షౌహిణుల మారణ మృదానుల
యింగలమ్ములు జగత్ప్రళయము
నంగలార్చినవి.

వికృతసమరధ్వాన మాశా
నికటముఖరిత మౌచు, వాయు
క్షుభితపథమును దాటి శ్రవముల
సోకినది యపుడే !

యోగనిద్రాపరవశుం డగు
నుగ్రమూర్తి మహేశ్వరుండును
నిటల నేత్రముఁ దెఱచి భైరవ
నృత్య మొనరిచెనో!

నీ ముఖమ్మున భర్గతేజము
నిశితమై, మృత్యూచ్ఛ్వసితమై,
ఆగమించెను పరిప్లావిత
మైన ఝుంఝువలెన్.

చదలు పెద పేలినది — కాష్ఠపు
రొదలు రొదలై, విదళితములై,
చెదరినవి స్రోతస్సులుగ ఖర
శిఖలు దెసదెసలన్.

చండతేజము నిండి నెత్తురు
చెండులై గగనమునఁ దారలు
మండినవి, జ్వాలోరగమ్ముల
పిండు బుసఁ గొట్టెన్.

ప్రేతనాథుని నటజ్జ్వాలకుఁ
జేతు లె_త్తెను సృష్టికల్పము
విశ్వమే రంగస్థలమ్మై
వెలుఁగునో నీకు !

విక్రమా ! ఓ విక్రమోత్థిత
చక్రఘోషిత వర్ష్మమా! నీ
చంక్రమణముల విస్ఫులింగ
చ్ఛటలు భువి నిండెన్.

# పరాకోటి

## నేను

ఏ దిశాంచల గళములో నే యెడంద
పేలెనో! గుండెనెత్తురు పేరుకొనఁగ
జీవితచ్ఛిన్నగాథ సూచించు స్రోఁత
బయలుదేరె నొక విషాదవార్త మోసి.

ఇది హృదయపుటమును గదలించె నేమొ
శిథిలభగ్నతంత్రులు చలించినవి, చిర పు
రాస్మృతుల గంధహేమంత రవము లిపుడు
గాడువారిన తప్తరాగమ్ము లొలికె.

ఓ విషాదవాద్యమ్ములారా ! విలాప
దారుణాఖండ రుధిరోరుభేరి పైని
నేనె కంపింప నా రుద్రపాణి మ్రోసె
నెపుడొ ! నాఁటి ముక్తాయింపులేల మఱల ?

నా కుటీరజీర్ణప్రాంగణమ్ము నందు
నిఱులరేకులఁ గదలిక బఱచు మీ యు
లూకనేత్ర చుషిత సమాలోకనములఁ
బేదవల్లిక యట్లుఁ గంపించె బ్రదుకు.

మరణ ఘోష

ఒకబలీయమగు తుపాను కకట ! రాలి
చివురుగుత్తులు పడిన విశీర్ణవీథి
నొక్క నిశ్వాస మేనియు నూర్చలేక,
యూరడిల్లదు బ్రతుకె ఆ హోరులోన !

నవవికాసమ్ము లాక్రందనమ్ము లౌచు
దుమ్ముగాఁ బెల్లురేగఁ జైత్రమ్ము మురువుఁ
జెఱపివైచు కాలాంబుదశ్రేణి యందు
నింత మలినంపు రొదయె వాయెత్తి చనదె ?

నీ యెడందను దొలిచిన మాయమంగ
ళార్తిఘోషలు విశ్వసంకీర్తనమున
సౌరు లేని యరుచివోలె జీరవోయి,
సృష్టి తొలిసంధ్యనే ధ్వనించెను గదోయి !

దుర్భరపు బాడబమ్ము తో ద్రోపులాడు
క్షుద్రకల్లోల జాల సంక్షుభ్యమాన
సాగరస్వాంత జరఠనిస్స్వనము లట్లు
దగ్ధజీవిత మరణవాద్యముల మేము !

నేను

అలసగతి మ్రోగు మరణఘోషలను గూడి
కిట్టుగానుగ వలె నేను మొట్టవెట్ట,
దూరమున నుండి దివ్యఘంటారవమ్ము
వోలె సోలిన దొక సన్న యేలపాట

వినుచు నుండఁగ నా గీతి వికసిత మయి,
సంజగాలులఁ బైరుల చాలితములు
బెళుకు టొయ్యారముల నీటఁ గులికినట్లు
ముర్మురించెను గికురింత మోసులెత్తి.

ఆ మనోహర దివిజగానామృతమ్మ
శ్రవణముల దాటి నా యంతరమ్ము నిండి.
మారుత విలీన మృదుపరీమళము వోలె
శాంతిపూరితమైన తేజస్సుఁ గురిసె.

మొత్తు జడివాన రాయిడి బుడగ లొరసి
ప్రమ్ము వడగళ్ళ గాజుపొంకమ్ము లట్లు
జితులఁ బ్రిదిలిన కన్నీటి చినుకు లేర్చు
కడుపు చుమ్మలఁ గళ్యాణ గాన మేల ?

ప రా కో టి

కొండవాఁగుల కమ్మని నిండు టలల
శుభ్ర నైర్మల్యమును బోలి, స్థూల జగతి
కవల నున్నట్టి ప్రేమరాజ్యమ్మునుండి
తొరఁగు గీతాపరాకోటి దూతి నేను.

లలితగోస్తనీ ఫలముల గెలలు దిగిన
వల్లరుల పందిళుల నీడ చల్లదనము
మంచు విరిగిన చివురు జొంపము సొబంగు
రగులు నగురు వెన్నెలగ మా నగరు లోన !

అచటి శాంతిమయూఖ సింహాసనమున
గళలు కందలించు నెమలికన్నువోలెఁ
బ్రాయపున్ సూర్యకాంత పుష్పమ్ము భంగి
దివ్య రోచిస్సుతో మృత్యుదేవి మెఱయు.

ఆమె సౌజన్య విమల పాదాంబుజాత
కింకిణీ మందమంద స్వరాంకురములఁ
బాలబుగ్గల నిగ్గుగాఁ బయికి నేను
చిమ్ముకొని వచ్చు గీతికాశీకరమును.

నీరు టెండల నేఁడు వెన్నెలను విప్పి
సొంపు వెలికొత్తు శక్రచాపంపు వంపు
పగిది, మమతలఁ జెఱవడ్డ ప్రాణికోటిఁ
బూత మొనరించు మాంగల్యగీతి నేను

నే ను

ఒక యయస్కాంత మట్లు నీ యూర్పులోని
తావి న న్నీడ్చుకొనినది తరఁగఁ జేసి-
భూనభమ్ముల యాశ్లేషముల మహోమ
హోన్నతిని భొంది నే నంత నుబికిపోదు.

నన్ను బహిరంతరముల నానంద మలము
కొను సుఖాన హావిస్సునై కుంచుకొనుచు
నంతరిక్షపు వారాశియందుఁ దేలు
చవితి నెలవంక పడవ ముచ్చట వహింతు!

*

